## ఉపవాసవ్రతములు

ఆ॥ ఒక్కపొద్దునుండి యూరపందై పుట్టు దపము సేయఁ బృథివి
బేదయగును సిగిడి శిలకు మ్రొక్క సిద్ధిఁబొందుదురు, విశ్వ.

ఆ॥ కష్టమైనమలము కడుపులోనుండఁగ నంతకంటె జెడనదియున్న
రసము యనము లేనినరులు ఉపవాసకుందురు, విశ్వ.

ఆ॥ కూడదేమిచేసె గుణమేమిచేసెను భూమియేమిచేసె బొందకంటె
నరుడు పడెపాటు నగుబాటుచూడంగ విశ్వ.

ఆ॥ కూడుపెట్టకున్న గుక్షిలో జఠరాగ్ని భక్షణంబు సేయు గుక్షిమలము
కూడువిడిచి మలము గుడుచునా యుపవాసి విశ్వ.

ఆ॥ వ్రతములెన్నియైన పట్టి దిక్కౌకాని ఆత్మచిక్కగావనలవికాదు
ఆత్మచిక్కబావు నతడెరా ఘనయోగి విశ్వ.

క॥ వెయ్యారునదులజలములు తియ్యకమారీ మునుగ బ్రోవ ద్రిప్పుట కాదా
కొయ్యాగులాముకజ్ఞానము వెయ్యైనా తెలుపరాదు వినరా వేమ.

## స్నానసంకల్పము

ఆ। స్నానమొనర జేసి దానంబునల్పక నీళ్ళమునుఁగ దగునె నేర్పు లేక
నీళ్ళయందునుండు కి నెలవుగాము నుగదా? విశ్వ.

ఆ॥ సేతునందుమునుఁగ శ్రీతిగాకి తెలుపాన కాశికేగ గ్రద్దగరుడుం
డౌన బదరికరుగ మునలిబాలుండు కాడయా విశ్వ.

ఆ॥ గంగస్నానమాడి ఘనమైనవారెల్ల భంగపడిరి పెక్కుబాధలంది
గంగనీటికన్న గయతీర్థములకన్న నెన్న వేమ తీర్థమెచ్చు వేమ.

ఆ॥ నీళ్ళమునుఁగనేల నిధుల మెట్టఁగనేల మొనసి దేవళముల మ్రొక్క
నేల కసరు కల్మషంబు కడుపునిండుగనుండు విశ్వ.

క॥ తల్లీ యనుచు మునుఁగుచు నిల్లాలాయనుచు చేతు రింపుగ ధరలో
గల్లరిమనుజుల గుణములు ఛల్లనబోచూడ నిదియుక్తి యిలో వేమా.

క। చేతోసంకల్పంబున నీతితో వర్తించేనపుడె నిర్మలపదముల్ ప్రీతిం
బొందగ నుండును భూతలమున నధికయోగ పురుషుఁడు వేమా

ఆ॥ త్రాడుమెడను వేసి తనకునూర్ద్రత్వంబు పోయెననెడిదెల్లబుద్ధి
లేమి మదినిలుపక త్రాడుమరి వన్నెదెచ్చునా? విశ్వ
ఆ॥ జననకాలమందు జందెత్రాళ్ళను లేవు తనకు లేదుతల్లిమెడకు లేదు
నడుమజందెమిడగ నగుబాటు కాదొకో విశ్వ.
ఆ॥ కల్లుఘటికి భూతిఘనముగా బెట్టిన నందులోనికంపు అణగినట్లు
మెడను త్రాడు వేయ మెఱుపుతో ద్విజుడౌనె? విశ్వ.

—♦ వేదము ♦—

ఆ॥ వెత్రికుక్కలనల వేదముల్ చదివేరు యాశ్రయంబు నెరుగరయ్యె
గాల్ల వేదసారమంత వేమనయెరుగును విశ్వ.
ఆ॥ విప్రవరులమంచు వేదంబు చదువుచు బ్రాహ్మతుంబజూచి పరిహ
సించు ధరణిసురులుకన్న దాసరిమతి మెచ్చు విశ్వ.
ఆ॥ తన్నుదెలియకున్న దగవేదములవెర్రిసన్యాసపదకుముసాబు వెర్రి
ఆరుశాస్త్రములను నాపురాణములు నిజము లనుచు జగంబు వేమ.
క॥ వేదంబనగా వాదము వేదంబున నంటియుండు వెన్నుడు శివుడు
ఆదైన మూడమన్నిట భేదాభేదములు లేవు పృథివిని వేమా.
ఆ॥ వేదశాస్త్రములను విని నేమికుడిచిరి యనితిరిగియుందరట్లునయిరి
బ్రహ్మమెఱుక దెలిసి బ్రతుకుట నిజమయా విశ్వ.
ఆ॥ వేదములుచదివియు విరివిగు పెకానిఅడుగు కుతికవచ్చి రందరిట్లు
బ్రహ్మతత్త్వమెఱిగి బ్రతకిబ్రతుకయా విశ్వ.

—♦ చదువు – సాధ్యాలు ♦—

ఆ॥ చదువుచదవకున్న సౌఖ్యంబునుండదు చదువుచదివెనేని నరసు
డగును చదువు మర్మమెఱిగి చదివినచదువరా విశ్వ.
ఆ॥ చదువు చదివిచదివి చదువంగచదువంగ చదువచదువ కొంత
చదువవలయు చదువుమర్మములను చదువగతరమౌనె? విశ్వ.
ఆ॥ చదువులెన్నోచదివి చాలవివేకియై కలుమచి త్తుడైన గలుషమల్ల
జాలిగుంటకుక్క దలచిన చందంబు విశ్వ.

ఆ॥ చదువులెన్నొ చదివి సర్వజ్ఞుడైయుండి బ్రహ్మవిద్యలెల్లబడటగలసి
మురికిరోనికొరకు పరమయోగముమాను విశ్వ.

ఆ॥ చదువులన్ని చదివి చాలవివేకియై మగిడితన్నెరుగక మందజనుడు
విసుగు చదువటంచు వెఱ్ఱియై చెడిపోవు విశ్వ.

ఆ॥ ఎంతచదువు చదివి యేనీతివిన్నను హీనుడవగుణంబుమాన లేడు
బొగ్గుపాలగడుగ బోవునా మలినంబు విశ్వ.

ఆ॥ తరచు చదువ చదువ తర్కవాదమెకాని దివ్యజ్ఞానమెవుడు తేట
పడదు వసరుకాచుపురుగు వగిదిని చెడిపోవు విశ్వ.

ఆ॥ చదువు చదువనేల సన్యాసిగానేలశివన్మ్రుతములకుజిక్కి చావనేల
అభవుభజనచేసి యాత్మలో దెలియుడీ విశ్వ.

ఆ॥ చదువులందు లేదు శాస్త్రమందు లేదు వేదములను లేదు వాదములను
నొడలుశుద్ధిజేసి యొడయని జూడరా విశ్వ.

ఆ॥ చదువుచదివిచదివి చావంగనేటికి చావులేనిచదువుచదువవలయు
చదువులేకకొంత జనము చచ్చిరికదా విశ్వ.

ఆ॥ చదువరిమతికన్న జాకలియేమేలు కొల్చువెల్పుకన్నకుక్కమేలు
ధరణి వేల్పుకన్న తత్వబుమేలరా విశ్వ.

ఆ॥ సకలశాస్త్రములను సంపుటములు వ్రాసి చదువగలరు చావు దె
లియలేరు చావెఱుగనిచదువు చదువంగనేలను విశ్వ.

ఆ॥ సానుభూతి లేక శాస్త్రవాసనలచే సంశయంబుచెడదుసాధకులకు
చిత్రదీపమునకు జీకటిపోనట్లు విశ్వ.

ఆ॥ ఆఱుశాస్త్రములను నాపురాణముల జదువ నేర్తురిలనుచావెరుగరు
వ్యర్థచదువు చదివి వడవడి జెడుదురు విశ్వ.

ఆ॥ కాలచక్ర మెఱుగగాలేక యెవ్వడుసంధ్యజపము సేయుజాణలార
సంధ్యజపములోను జాడలెట్లుండును? విశ్వ.

ఆ॥ సంధ్యవార్చనేమి జపముసేయుగనేమి వేదశాస్త్రమెఱిగి వెలయ
నేమి పరముగననివాడు బాపండు గాడయా, విశ్వ.
ఆ॥ మును తెలిసినవారు ముదమున ష్టమెరిల తిరిగిచెప్పి తినుచుదిట్టగలరు
తెలియజెప్పిన సూరి తెలిసికోలేరయా, విశ్వ.

—♦ గురువు ♦—

ఆ॥ మదమువలనగలుగుమాటలుబహువలికి ముచ్చుముద్దులాడి మోస
పుచ్చు కాసురా బెనగగడిట్టుండు గురుడౌను విశ్వ.
ఆ॥ దేహమాత్మరూపు తేటతెల్లముచేసి యావలిచూపుజూపునతడు
గురువు భ్రమరము తలరూపు క్రిములకిచ్చు రీతి, విశ్వ.

—♦ విద్య ♦—

ఆ॥ విద్యగలిగియుండి వినయంబు లేకున్న నైదువులకు మేలిమైనమణులు
సొమ్ములుండి కంఠసూత్రంబు లేనట్లు విశ్వ.
ఆ॥ సకలవిద్యలెఱిగి చదివి బ్రహ్మవిద్యనొకటి నేరమనుచు నుర్వి
జనులు కటకటన్ బడుదురు కనుమానినెరుగరు, విశ్వ.
ఆ॥ వేదవిద్యలెల్ల వేశ్యలవంటివి భ్రమలబెట్టి తేటబడగనీయవు గుప్త
విద్యయొకటె కులకాంతవంటిది, విశ్వ.
ఆ॥ ఇహమున సుఖియింప హేమకారకవిద్య పరమునసుఖియింప
బ్రహ్మవిద్య కడమ విద్యలన్ని కడు నిష్ఫలంబులు విశ్వ.
ఆ॥ ఆర్తవిద్యలెల్ల నపకీర్తిపాలాయె వార్తకెక్కుదెంతవారికైన వార్త
విద్యలెల్ల ధూర్తులపాలాయె, విశ్వ.
ఆ॥ సకలవిద్యలందు సంపన్నుడైయున్న యట్టివారు పరిచయమునం
జేసి పాటిబెట్టుచుందు పరికింప మెచ్చరు. విశ్వ.
ఆ॥ హీనుడెన్ని విద్యలిలను నేర్చినగాని ఘనుడుగాడు హీనజనుడె కాని
పరిమళముల గార్ధభము మోయ గజమౌనె, విశ్వ.

ఆ॥ హేమకారవిద్య నేరిగి పారెల్ల వెలబడనియట్లు విద్యచేత తత్వ
మెరుగు వెనుక తనకు చింతేలనో? విశ్వ.

ఆ॥ వేదవిద్యగాదు వీరవిద్యయుగాదు బాధవిద్యగాదు పశువుగాదు
మధురమైనయట్టి మనస్సునిల్పెడివిద్య సాధువిద్యకన్నసరగ వేమ

తే॥ ఇట్టిసాధువిద్య నెంచలేదనిచూచి గాధవిద్యనేర్చి కానలేక సాధు
సజ్జనముల సాంగత్యమెరుగక బాధపడుచుందురు తుంబకులు వేమ.

క॥ ఎన్నాళ్ళిల దాసుండును నెన్నాళ్ళకుదానునేర్చి యెన్నటవెలయున్
గొన్నాళ్ళకు దాజన్నను మన్నాయెను విద్యలెల్లమహిలో వేమా

## శకునములు

ఆ॥ తీస్పి కట్టైనేని దెలియ భరద్వాజికూర్చినట్లు పనులు గూలువాడు
నేను గాకపోను యువనిలో శకునంబు, విశ్వ

ఆ॥ పాలపక్షి శకునఫలమిచ్చునందురు పాలపక్షి క్రేమి ఫలము దెలియు
తనదు మంచిచెడ్డ తనలోననుండగా విశ్వ.

ఆ॥ మంచి శకునము లిలనెంచి పెట్టాడిన వారలున్నవారెకోరిచూడ
జనుల కర్మములకు శకునములే నిలచురా? విశ్వ.

ఆ॥ గద్దగణము నిదర్శకలలు కోరికలును ముదమొసంగుశకునములును
జెలగ ప్రశ్నలు పదివేలు పరికించిచూడగ విశ్వ.

ఆ॥ బల్లిపలుకులువిని ప్రజలు తమపనులెల్ల సఫలమనుచుదాముసమ్మ
తించి కాని పనులకు తమకర్మమటందురు, విశ్వ.

## కర్మము-విధివ్రాత

ఆ॥ వ్రాతకంటె హెచ్చు పరమీదు దైవంబుచేతకంటె హెచ్చువ్రాత
కాదు కానిపనులను దమకర్మమటందురు, విశ్వ.

క॥ విధికృత మందురె యున్నియు విధికిని విధిలెన్నయున్నో విష్ణునుతిం
పన్ విధియెవ్వడందురావల్ల విధిబ్రహ్మయు తెల్లియదెలియ వెల్ల
యూరలేమా.

క॥ విధిచేత జరుగదంచును మదిలోపల నెప్పు కలచి మమతగు బుద్ధిన్
బొదలుచు విడువగ జాలకు నదియే సంసారబీజ మనబడు వేమా,

ఆ॥ జన్మములలో నెన్ని జన్మంబు లెత్తినా కర్మధర్మములను గాననెంతో
కర్మధర్మములను కడ తేరలేరయా, విశ్వ.

ఆ॥ నూరు తప్పవచ్చు నొసటవ్రాయగరాదు వ్రాతకన్న సాక్షి వలన
తన్న పరమవ్రాత లేనివానికప్పు సుబలిమి సాక్షి తలప సమర్థుండు వే.

ఆ॥ నొసలువ్రాయువాని నొసలు కొంచెముబట్టి నొసలిప టువాని
నొసలివ్రాత నొసలిమీదవ్రాత నులిమిన పోవునా? విశ్వ.

ఆ॥ ఆకుమీదవ్రాత యందరకు తెలియు చేతిలోనివ్రాత చెప్పవచ్చు
తోలుక్రిందివ్రాత దొడ్డవాడెఱుగురా, విశ్వ.

ఆ॥ వారిలోనపుట్టి వారిలోన పెరిగి వారిబాసి యూడ వారిజేరి కర్మ
మ్మంటియున్న కారణమేమయా, విశ్వ,

ఆ॥ కర్మమధికమైన గడచిపోవగరాదు, ధర్మరాజు కాలిజాడగని చోట
గంకుబోట్లు చేయు కటకటా దైవంబు, విశ్వ.

క॥ కర్మాకర్మము లెఱుగని మర్మంబులు యింద్రజాల మహిమలు విద్య
ల్, కర్మలమర్మము నిర్మలమతి తెలియగవలయు నిజముగ వేమ.

క॥ కర్మాకర్మము లొక్కటి కర్మవినోదునకు తత్వఘనునకు తెలియున్
ధర్మాధర్మము తేర్పడ నిర్మలమతి తెలుపవలయు నిజముగ వేమ.

క॥ కర్మాకర్మకొరకు వర్మిలి నొకండును లోననాత్మయుక్తై ధర్మాధర్మ
ములకు నది నిర్మలమతి యైనవాడు నిలుచును వేమా.

ఆ॥ ఎన్నిచోట్లదిరిగి యేపాట్లువడినను అంటనియ్యక శని వెంట
తిరుగు భూమి క్రొత్తదైన భుక్తులు క్రొత్తవా? విశ్వ.

—♦ కో రి క ♦—

క॥ కోరినకోరికలెల్లను నేలిమిగా జరుగునటర? మెచ్చరు భువిలో
గారణకర్మప్రకారము కోరినకోరికలు కలుగు గొబ్బున వేమా.

## ఋత్విజులు పూజార్లు

ఆ॥ పూజసేయు సేయ బూజారితానౌను బూజవస్తువెన్న భువినితాను
యేడపూజసేయ నెల్లదిక్కులుతాన తానునేన నేనతానువేమ.

క॥ మర్త్యమున బ్రాహ్మణులమని మర్త్యులు తమదెలియలేక ముదమున
తిరిగేవ్యర్థవిప్రుల దప్పులు వ్యర్థముగానె పరికైరి నవనిని వేమా.

## రోగము వైద్యము

ఆ॥ వ్యాధికలిగెనేని వైద్యునిచేమందు తీసితినకగాని తీఱదెట్లు
మందుపంటలెన్ని మనసున జూచు గావలె విశ్వ.

ఆ॥ వ్యాధికలిగెనేని వైద్యునిచేతను మందుతినకగాని మానదెందు
జెంతదీపమిడక చీకటితొలగునా? విశ్వ.

ఆ॥ వ్యాధిపీడితంబు వ్యసనసంతాపంబు దుఃఖసంభవమున దొడరు
భయము లేనివారిలుండ లేరెటికయినను విశ్వ.

ఆ॥ బడుగునెరుగలేని ప్రారంభశంబది యేల ప్రోదియిడని బంధుభూతి
యేల వ్యాధితెలియలేని వైద్యుడుమరియేల? విశ్వ.

ఆ॥ వ్యాధినెరుగలేని వైద్యులబడేలనో శోధన తెలియలేని శోధకు
లేల మనసు తెలియలేని సుజ్ఞానమేలరా? విశ్వ.

ఆ॥ రోగిరసిక్టటి లోకోపకారులు భోగభాగ్యములను బొందుదురు
పూర్వకర్మను తెగి పురహరుతావున మ్రోగుచుందురట్ల మొనసివే.

ఆ॥ రోగిమైనవాడు రోగినెమగును రోగినరసిచూసి రూఢిగాను
రోగికిడినవాడు రాగిబంగారమౌ విశ్వ.

ఆ॥ కుండపగిలెనేని క్రొత్తదకొనవచ్చు భూతలంబునందు బొందుగాను
కాలబడిన నరుడు కుదురుట యరుదయా విశ్వ.

ఆ॥ దిక్కులేని రోగి దీనత బాపిన బురుషు డిహమునందు బూజ్యు
డగును పరములందు వాసిభాగ్యమేమనవచ్చు? విశ్వ.

— బాం దె —

ఆ॥ బొందెలు గనవేఱు భువిప్రాణమొక్కటే అన్నములిల వేఱు
నాకలొక్కటి దర్శనంబు వేరు దైవంబునొక్కటే విశ్వ.

ఆ॥ బొందెలు కనవేఱు భువిప్రాణమొక్కటే అన్నములిల వేఱు
నాకలొక్కటి పుష్పములిక వేరు పూజలొక్కటీసుమ్ము విశ్వ.

ఆ॥ బొందెయొవరిసొమ్ము పోషింపబలుకూరు ప్రాణమెవరిసొమ్ము
భక్తిచేయ ధనము దెవరిసొమ్ము ధర్మమే [illegible]సొమ్ము విశ్వ.

ఆ॥ అస్థిరమగుమేను కధికపాటులనంది పెక్కువిధములిలను బెంచి
పెంచి అగ్నికిచ్చు లేక యీటనక్కలకిచ్చు విశ్వ.

ఆ॥ తోలుతిత్తిలోన దొలుకబెట్టినవాని వెనుకదెలియవలయు వివర
మెఱిగి వెనుక తెలియకున్న వైరియై చెడిపోవు విశ్వ.

— ఘ ట ము —

ఆ॥ మనసులోననున్న మతమెల్లనొకటైతే మనలోనున్న మహిమ
నెఱుగు మహిమనెరుగకున్న మరణంబునెఱుగుగా విశ్వ.

ఆ॥ ఘటముగాన్గజేసి గానుగద్దుగజేసి నిర్గుణము నువ్వులుగ నీవుచేసి
తెలిసి గానుగాడ దివ్యామృతము యోగి విశ్వ.

ఆ॥ ఇట్టిఘటములోనం బెట్టినజీవుని గానలేక నరుండు కాశికేగి
వెదకి వెదకినరుండు వైరియైచెడిపోవు విశ్వ.

ఆ॥ ఘటములోననున్న మతములన్నియుగోసి దిటవుజేసి మనసు తేట
పఱచి ఘటము నిల్పువాడు ఘనతత్వయోగిరా విశ్వ.

ఆ॥ తోలుఘటములోనం దోలంగక యున్నప్పుడాలుమగలరీతిసలరు
చుండు జీవి ఘటమువిడువ వికృడిపోవురా విశ్వ.

ఆ॥ ఘటమ్ము జలమునందు గగనంబు గనిపించు ఘటము జలము లేమి
గగనమేమి ఘటమున జ్యోతి గ్రహములోన దెలియుడీ విశ్వ.

ఆ॥ ఒక్కనీరుపోసి పెక్కుఘటములున్నవందు నన్నిరూపులలరుచుండు
ననిలోం దొలంగెనేని అన్నియును బయలౌను విశ్వ

—♦ కాయము ♦—

ఆ॥ కాయము దగఁగూడి కడఁగి యోగిగనున్న గాయమింలను వడిన
ఘనుఁడుకాఁడు కాయమునను ముక్తిగతి కేగవలెనయా విశ్వ.

ఆ॥ కాయమునుబడయుతోట కాయము కాదుఁబో కాయము బయలందు
గాయమగుఁ గాయము విడుచుటయు గాయమే ముక్తిరా విశ్వ.

—♦ రూపము ♦—

ఆ॥ రూపువలన బేరు రూఢిగాఁగల్గెను పేరువలన క్రియలు పెనుగు
చుండు నామరూపక్రియలు నాశమైపోవునా? విశ్వ.

ఆ॥ రూపములిలను గురురూపులు ముగ్గురు వారివారినెఱిఁగి గారవింప
మొదలు తాన యుక్క మోక్షంబుగద్దురా విశ్వ.

ఆ॥ రూపికి దగుజీవరూపంబు గనరాదు యట్టిరూపమును గనలరికాదు
బ్రహ్మ మనుఁగనున్న బ్రహ్మంబుగనరాదు విశ్వ.

ఆ॥ రూపులేనివనిత రూఢిపతివ్రత నీటులేనివాఁడు పోటుబంటు
తెలుపవచ్చువాఁడు దేవతాబంధురా విశ్వ.

ఆ॥ ఏరూపున నారూపము లోరూపున జూపుచుండ లోకరాధ్యుం
డేరూపు జూచువారికి నారూపున గానిపించు నభవుఁడు వేమా.

ఆ॥ తనదురూపమంత తాన చూచినవాఁడు మనసుదీపముగను మ
మతదలంచి యనుదినమును జూచునతఁడెపో బ్రహ్మంబు విశ్వ.

ఆ॥ రూపుమాసి రూపురూఢియై వెలుగొందు దావులేని ప్రమాణకల్ప
తరువు రూపుదృఢముచేసి చూచినజావురా విశ్వ

ఆ॥ ఎట్టిరూపు గనిన నీరూపు కనిపించు నీదురూపుజూడ నిలుచు
దెలివి అట్టి తెలివిచేత నీశ్వరుఁడయి తోఁచు విశ్వ.

ఆ॥ తప్పువేషమూని ధరలోన దిరిగెడి చేతలెల్ల మిత్తి జేయుటకునె
కడుపునింప నింత కష్టంబులేలరా విశ్వ.

ఆ॥ దేహమాత్మరూపు తేటతెల్లముచేసి యవలిరూపుచూచునతఁడు
గురువు భ్రమరము తనరూపు క్రిములకిచ్చినరీతి విశ్వ.

ఆ॥ కల్మషములు సోక కాన్పించదెందును రూప మెవ్వరికిని రూఢి
గాను తాపసంబులుమగ దగగల్గు జ్ఞానంబు విశ్వ.

ఆ॥ నీళ్ళుపోసి కడిగి నిత్యంబుశోధించి కూడుపెట్టి పైనగోకకట్టి
యేమిపాటుపడుదు రీదేహగ్రంధికి విశ్వ.

## —♦ హత్యలు ♦—

ఆ॥ స్త్రీలజంపువాని శివుడుమెచ్చగలేడు స్త్రీలజంపువాడుశిథిలమగును
స్త్రీలజంపువాడుశివశివా నరకంబు చెప్పనేరనయ్య చెందువేమ.

క॥ క్షితి శిశుహత్యలుం చేసిన మతిలేకున్నట్టి కుమతి మనుజులభావల్
గతి యంత యింత యెంతని మితములనే జెప్పలేను మేదిని వేమా

ఆ॥ బ్రహ్మహత్యసేయ బహురోగములుగల్గు బ్రహ్మహత్యచేత
బాధపడును బ్రహ్మసేయు పాపంబు తలపోయ విశ్వ

ఆ॥ కాలుచేయిలేదు కంచుకంబులుగలవు కొమ్ములేవు యుంకిచిమ్ము
వేగ కరడిలేక చంపు గడుపెద్దచోద్యమా విశ్వ.

క॥ చంపిన పాపముగలుగును జంపినపుణ్యంబుగల్గు సర్వజ్ఞుకున్
జంపను మనువను దెలిసిన చంపిన యాయముల గొట్టనగురా వేమా.

## —♦ కథలు ♦—

క॥ కథనంగామునుపున్నవి కథలెన్నియొచదివిచదివి కలవరపడగావృధ
విని మృతికినిసిక్కము మునుపమునుసబ్రహ్మంబునంటము క్తిర వేమా.

## —♦ జీవము–జీవాత్మ ♦—

ఆ॥ జీవులెల్ల మురిసి జీవాత్మ పరమాత్మ జతితెరింగి పాపజలధిబడరు
నావ నడుపువాడు నట్టేటముంచుగునా విశ్వ.

ఆ॥ జీవముండుచోటు స్థిరముగా దెలియక తిరుగు స్థిరమగు దేహ
మందు దిరుగనేల ననుచు దెలియలేడజ్ఞాని విశ్వ.

ఆ॥ జీవుడుండునెపుడు శిరముకంఠములందు భాలమందునుండు పర
మాత్మ చిక్కగనున్నలందు జీవాత్మపరమాత్మ విశ్వ.

ఆ॥ జీవగుణము గలుగు జీవుండు బ్రహ్మంబు సాటిరొచ్చునట్లు సరవి
తోసు యూరికుక్క సింగ మొక్కటియగునొక్కొ, విశ్వ.

ఆ॥ జీవిపోకమునుపె జీవవస్తువులిచ్చి జీవి నిలుపవలయు జీవమునగ
జీవి తొలగువెనుక జీవవస్తువదేల? విశ్వ.

ఆ॥ ఎవ్వరెరుంగకుండ నెవ్వాడు పోవునో పోవుజీవియట్టి బొందివిడచి
అంటిమాత్రమునను సకీర్తి యెరుగక పట్టువిడరుదు వెర్రి వే.

ఆ॥ జీవభేదమెఱిగి చెడిపోని వారలు బ్రహ్మభావమొందిపరగుచుంద్రు
వీరు ముత్యమైతె నీయగామూరునా? విశ్వ.

ఆ॥ తనదుకోసి జీవి తత్వము తెలియక వేతేయుచుము దలచి వెతకు
ఇల్లు భానుపైకి దివ్వెపట్టి వెతకినరీతి, విశ్వ.

ఆ॥ జీవమేదనుండు భావమెక్కడనుండు కాపురంబులేక గలసియుం
డు దనరుచున్న రంటిస్థమేల దెలియరో? విశ్వ

ఆ॥ జీవుని దెలియక జీవుం వేరె భ్రమబొరలు సరుదు దేవునిదలపక
జీవుండని వివరించిన భావింపక జీవి బట్టిబయులుర వేమ.

ఆ॥ జీవసంజ్ఞ గలుగు జీవునితత్వంబు జీవపరుని గురుని జెందజేసితనువు
నిలంవువాడు తత్వజ్ఞుడగుయోగి, విశ్వ.

ఆ॥ ఎనుబదినాలుగులక్షలం పసబరగిన జీవరాసులందుకు మును దా
జనియించుపథము దెలిసిన మనుజుడయోనీతిపరుకుమహిలో వేమ

— ♦ పరమాత్మ —

క॥ దశవాయువులును మరియును బసగలయీదేహమునకువంచెను
భవుముల నొనలున దెలియుదు రెవరెనచటపరమాత్ముండుం
నరయుము వేమా.

ఆ॥ నిదురమేలు తెలిసి నిలుపుడీ మీలోన ప్రాణిమేలు తెలిసిబాయ
కుండు ప్రాణి నిదురవండు పరమాత్మ నెరుగురా, విశ్వ.

క॥ తానునిర్మరిమైనం దానకమున దన్ను దానె తప్పించుకొనుగా
దానె నవిధములను మది తానే పరమాత్మననుచుదలచుర వేమా

### —♦ సగుణోపాసనము భక్తి ♦—

చ॥ సగుణము నాత్మలోనలను సన్నుతిసేయక భక్తినిల్పనే జగముల
నిట్టివారలకు సజ్జనసంగతిగాక నిచ్చునే సగుణముమీదమానసము
నంతత చింత యొనర్పకున్న నాయగణితమైనమోక్షపదమంతగ
నేగతివచ్చు వేమనా?

ఆ॥ సజ్జనముల చెలిమిచాలింపగరాదు ప్రకృతి నెరుగకున్న ఫలము
లేదు పలువలెట్టిరీతి భక్తినిల్పుదురొకో విశ్వ.

### —♦ త్రిగుణములు ♦—

ఆ॥ అష్టదళములకును నాధారమైనట్టి యాదిదేవుడొకడునఖిలజగము
త్రయము దాటువాడు దానెపో బ్రహ్మంబు; విశ్వ.

ఆ॥ విమలచక్రమందు వింతలెన్నొ తెలిసి శమనగాలిచేత సన్నుతింప
గనగరాదు మహిమ ఘనులగయిననుగాని విశ్వ.

ఆ॥ అష్టతనువులకును నాదిమమైనట్టి యాదిశక్తిగూడి యభవుడగును
భయము లేకయుండు బ్రహ్మజ్ఞుడగు యోగి, విశ్వ.

### —♦ కపటయోగులు ♦—

ఆ॥ బోడితలలు జడలు బూడిదపూతలు నాసనములు మారుభాషణ
ములు యోగికాదు లోన బాగు కాకుండిన, విశ్వ,

ఆ॥ పుస్తకములు జడలు పులితోలు బెత్తంబు గడుసాలలు వదిలకు
లైన మోతచేటుకాగ మోక్షంబు లేదయా, విశ్వ.

ఆ॥ కంబళములగట్టి గంతల గజ్జల బోడితలల సొంపు పొల్పుమీఱ
ఆత్మ నెరుగలేని యతియేమిచేయును? విశ్వ,

ఆ॥ తలపులోనిమురికి తలపెటంగగ లేక తలలుబోడులైన ఫలము లేదు
తలలు బోడులయిన తలంపులు బోడులా? విశ్వ,

ఆ॥ పరమహంసననుచు బలుకుచు చెపుచు భూమిబరధనములకాశపడెడి
వాడు పరమహంసకాడు పరమ హీనకరుడయా, విశ్వ.

ఆ॥ భూతి దేహమందు బూసిన యంత్యైనా నిష్టశివుని యందు నిలువ
వలెను గాక భస్మమందు గాడిద పొర్లదా? విశ్వ.

ఆ॥ బారెడేసిజడలు భస్మాంగపూతలు వ[illegible]సుతర[illegible]డ మారు
మలయు మంజిగోచులెల్ల [illegible]జెగోచులు[illegible]యె, విశ్వ.

ఆ॥ ఘటము నింద్రియములు గట్టివేయగలేక చావువచ్చునపుడు
సన్యసించు ఆత్మశుద్ధిలేక యంటునా మోక్షంబు? విశ్వ,

ఆ॥ లోన వదిలవరచి లో వికారంబులెల్ల జరుగకున్నవాడు తపసి
గాడు వెలి వికారమెల్ల విధిపాలు కోర్కులు, విశ్వ.

ఆ॥ ఒడలు బిగిసికొనిన యోగుల వేషంబు మనసు క్రమంబు
మానుపలేదు పుట్టమీదగొట్ట భుజగంబు చచ్చునా, విశ్వ.

ఆ॥ ఒడలు భూతిపూసి జడలు ధరించిన నొడయుడగును ముక్తి
బడయలేడు తడక బిరుపెట్ట తలుపుకో సరియగునె? విశ్వ.

ఆ॥ ఎండనీడచంద మెరుగనేరక యోగియుండు సల్లకాల ముర్విలోన
దిండిపోతునగుచు దిరుగుచునుండురా, విశ్వ.

—♦ షట్చక్రాలు ♦—

ఆ। అష్టదళములకును నాధారమైనట్టి యాదిదేవుడొందునఖిలజగము
త్రయము దాటువాడు తానెపో? బ్రహ్మంబు, విశ్వ.

ఆ; ఒంటిస్తంభమందు నొవర గంకణమాను నారుకంకణము లమరి
నిల్చు నవలదాటి చూడ నది పరమాత్మడౌ, విశ్వ.

ఆ। అరసిగట్టిచేసి యాధారచక్రంబు ప్రాణవాయువందె బదిలపరచి
మెడ తెగక నెయుండ నిల యోగ్యుడగు దాను, విశ్వ.

ఆ। నరవితోడగూడు స్వాదిష్టచక్రంబు ప్రాణవవములను బందుచేసి
వెడలుకుండువాడు వేదాంతవేద్యుడౌ విశ్వ.

ఆ॥ మఱియు పూర్వచక్ర మహిమందు గనుగొని వ్యానవాయుచేత
వసరుచున్న మనసు చెడకయున్న మర్మంబు తెలియదా, విశ్వ.

—♦ దశవాయువులు ♦—

క॥ దశవాయువులును మఱియును బనగల యీదేశమునకు బంచెను
భవుడుగా నొసలుగ దెలియుదురెవరే నచటే పరమాత్ముడుండ
నగునుర వేమా.

—♦ పంచేంద్రియములు శ్రోత్రము ♦—

ఆ॥ చెవులవిన్నయట్టి రవమును వివరించి మనసు జెరిగినపుడు మఱలు
గొనుచు చెవులు శబ్దములను జెవరోయు ముక్తిరా విశ్వ.

ఆ॥ చెవులు గోన బుట్టురవమె యోంకారంబు కన్నులగనునవియె కళల
జ్వాల ముక్కులోనిగాలి ముక్తికిత్రోవయా, విశ్వ.

క॥ వినదగు నెవ్వరుచెప్పిన వినంతనె వేగపడక వివరింపదగున్ విని
కని వివరము దెలిసిన మనుజుడెపో నీతిపరుడు మహిలో వేమా.

ఆ॥ ఉన్నవారలెవరు చన్నవారెవ్వరు? కన్నవారలెవరు గానరారు
ఉన్న చన్న కన్న నొక్కడే చూడరా, విశ్వ.

ఆ॥ విన్నసుద్దికొంత వినని సుద్దులుకొన్ని వింతసుద్దులెన్నొ వినగ
జెప్ప దెలియుదాను గన్నయట్టి దాంభికుడెప్పుడు విశ్వ.

ఆ॥ విన్నవానికన్న గన్నవాడధికుడు గన్నవానికన్న గలియువాడు
మున్నతోన్నతుండు సర్వలోనేయుండు విశ్వ.

క॥ విని కలయికలను బాయును గని కలసిన కాంతగూడి కలియును
బాయుగ గని కలియం బ్రేమపోయెను గని కనుటే ప్రేమ మేటి
యొ కనరా వేమా.

## — త్వక్కు —

ఆ॥ చర్మమునకు స్పర్శచక్కగాఁ దెలియదు కర్మముల్ పొసగుటఁ
గానగలఁడె? చర్మకర్మలుండు జగతిఁ గలకుముక్తి మోసపోను
మొనసి వేమ,

ఆ॥ చర్మమెందు జీవసౌఖ్యంబుగోరును జీవికర్మములను జేరుచుండు
జీవికర్మవల్ల కడరోయు దత్త్వమా విశ్వ

ఆ॥ సర్వగాలి కలిసి పదమున కర్మంబు తెలియజేసినపుడు దేహము
నకు దేహవాంఛచేత దెగితేరలేదయా విశ్వ

ఆ॥ కడుపులోనివానిగానగలేరయా కష్టపడుదురింతె కాని జనులుహీన
మెఱుఁగు నతడు యివియేల యెఱుగును? విశ్వ

ఆ॥ ఎదుటనున్నవాని సెప్పఁడుగానక కూటివాని వెదుక వదరు
చుంద్రు బయటకొండుకలకును భ్రమయేల తెలుదో, విశ్వ

## — చక్షు —

ఆ॥ కానరానివాని గనుపించువానితో గావుచేయవలుకకరుణతోడ
గానరానివాని కరుణేమి కందురో విశ్వ

ఆ॥ కంటిలోనివాని గరకంటు దెరుగును గంటిలోనివానినింటజూడు
కన్ను మిన్ను హృదయకమలమం దెరుఁగుము విశ్వ

ఆ॥ కనియు గానకుండ గదలవడానారు విసకయుండు విస్మయంబు
సంపదగలవాని సన్నిపాతకమది విశ్వ

క॥ కనియుండియుగన లేరటవినియుండియువినగ లేరు విస్మయమే మోకన
గ్రుడ్డియువినజెవుడును యనునది లెస్సాయెజనము నవనిని వేమా

ఆ॥ కానలేదు నుదురు కన్నులువీపును నానలుగా లేదు నెత్తిమీద
దనుగానలేదు తత్వమే మెఱుగును? విశ్వ

## —♦ జిహ్వ ♦—

ఆ. జిహ్వాలంపటంబు జీవనంబై యుండు జిహ్వాలంపటంబు జీవపోష
జిహ్వచేత నరులు చిక్కనొద్దిరికాని విశ్వ

క. జిహ్వయురుచులనె కోరును జిహ్వకు మఱియొకటిమీద జింతేశ
దయా జిహ్వకు జింతలు తొలగుట బ్రహ్మము నేననుచును బల్కం
బాడిదె వేమా

ఆ. జిహ్వరసమువల్ల జీవంబు బోషించు బ్రహ్మకున్న రసము బాపలేరు
రసము ద్రాగునట్టి రాజులు కలరొ, విశ్వ

## —♦ నవద్వారములు ♦—

సీ. తొమ్మిదివాకిళ్లు తొలంగ శివునకు నెమ్మదిగానుండు నెనయుం జూ
డ జెలు కన్నులు ముక్కుం జెలంగినోరును నేడుగుదమును గుహ్యం
బుం గూడుంజేర్చి అందుం దొమ్మిదితూటులమర చేర్చ అదియునా
ధారముల నాటు నానం వేసి భేదంబులేకను బెరిగెడి దేహంబు
వాయువు లపదితోడ వరుసగాను యిన్నిగల్పించి దేహంబు
నెనయజేసి తన్ను మరపించి లోకంబు తగులుంగలిపి వాడు మరగియు
గానక వరుసగాను బుట్టజేసెను నెలమిరి బుడమి వేమా

## —♦ జ్ఞానేంద్రియములు ♦—

సీ. శ్రవణముల్ గోరును సంగీతసాహిత్య భాషాదులయినట్టి పలుకు
లెల్ల చర్మంబు కోరును సరవితోడుత శైత్యమున్ ఉష్ణ కాఠిన్య
ములను నెపుడు గన్నులు గోరును గరములవర్ణంబులయినట్టి రూప
ముల్ వరుసతోడ నాలుక గోరునునయముతోడుత రుచుల ఒగరు
గారము చేదు నువ్వాబులును ముక్కు గోరును గంధము లమ్మదము
తోడ చెవులు చర్మంబు కన్నులు జిహ్వముక్కు యిన్ని కలిగిన
దిటువంటి దెల్లజూసి తన్నుగనుగొని ఘటియింప దగుర వేమా

## —♦ కర్మేంద్రియములు ♦—

సీ॥ వాక్కు కోరును మంచి వాగింద్రియములను వనచక్రమంబుల
వచనగాను చేతులుంగోరును చెలగిదానంబుల నియ్యఁబుచ్చు
కొనుట నిరవెరుంగు పాదములఁ గోరును వరగ సంచారంబు
బహుదూరమయినను బహిద్వారిల్లు మలవిసర్జనములు మహిగుదము
నగోరు వదిలంబుగానెట్టి పద్ధతగును గుహ్యమునుగోరు సంభోగ
కోరికలను నిట్టికోరికలెల్లను గట్టిపెట్టి నిన్నుజూచెడివాడెపో
నిర్మలుండు ఘనుడు కైవల్యపదవిని గనును వేమ.

## —♦ వాగింద్రియము ♦—

ఆ॥ వాక్కువలన గలుగు వరముక్తిమోక్షంబు వాక్కువలనగలుగు
వరసఘనత వాక్కువలనగలుగు నెక్కుడైశ్వర్యముల్ విశ్వ
ఆ॥ వాక్కుచేత గర్మవచ్చుచునుండగ వాక్కుచేత భోగబాధదగిలి
వాక్కుమర్మమెరుగువాడె పోబ్రహ్మంబు విశ్వ

## —♦ ఘ్రాణేంద్రియములు ♦—

ఆ॥ ఇయ్యబుచ్చుకొనను నింపొంద్గబాడియా నయమునటుండేయ
నలవిగాదు మనసుగాననిలను మరియొకరు లేరును విశ్వ
క॥ దానంబిచ్చిన చేతులు జ్ఞానంబును నెరుగనెందుఘనతరముగదా
దానమె తమతత్వమనుచు మానవులెంచంగ లేరుమహిలో వేమా

## —♦ పాదేంద్రియము —

ఆ॥ పాదపాయువులను బరగదేహముమోచు దేహజీవములను దెలియ
మోయు ధరణి వీసిరెంటి దానేలమోచుదో విశ్వ
క॥ పాదమున నడుచునరుడట లేదనగా భూమిదిరుగు లెన్నగదనకే
యేదైన పోసివచ్చిన సాదన పాదంబునడువ జరుగదు వేమా

—♦ పాయువేంద్రియము ♦—

ఆ. మలము జారవిడుచు మరిపాయువిధమున మలము చేత బలము
మనుజునకును మలముబిగిసెనేని మరిప్రాణహానియా విశ్వ

క. పాయుస్వనగనపానము మాయక నాదారియుండు మలవర్జముదా
జేయకయుండును నెప్పుడు నేమముతో జూడుమయ్య నేర్పుగ వేమ

—♦ గుహ్యేంద్రియము ♦—

ఆ. గుహ్యశ్రమముచేత కులమెల్లవర్ధిల్లె గుహ్యశ్రమము లేక కులము
లేదు గుహ్యశ్రమముచేత గొనలేకుమోక్షంబు విశ్వ

—♦ వివిధ విషయములు ♦—

ఆ. చెప్పులోనిరాయి చెవిలోనిజోరీగ కంటిలోనినలుసు కాలిముల్లు
నింటిలోనిపోరు యింతింతగాదయా విశ్వ

ఆ. ఉసురుతీఁతిత్తి నిసుమంతయూదిన బంచలోహములను భస్మ
మౌను పెద్దలుసురుమంటె పెనుమంటలెగయురా విశ్వ

ఆ. తేనె తెరలజాడ తేనెటీగయెఱుఁగు సుమరసంబుజాడ భ్రమర
మెరుగు పరమయోగిజాడ భక్తుండెరుంగును విశ్వ

ఆ. అనగనగరాగ మతిశయిల్లుచునుండు దినగదినగ వేముతీయనుండు
సాధనమునబనులు సమకూరుధరలోన విశ్వ

ఉ. రక్తిగనున్నపాటయని రమ్యముతోడను వ్రాసినవ్వినన్
శక్తికొలంది నీప్రజలు సర్వశ్రద్ధతో గూడిపాడినన్
ముక్తియనంగ జెల్వొనరు మోక్షముదారియు నీకు జేకురున్
భక్తితో చిన్మయంబునను బాడుగ జేర్పున నమ్ము వేమనా

ఆ. బండబూతులాడు పరమనీచుండైన్న దండివారిమేల్మి తానెరు
గునా చందనంబుఘనత పందియే యెరుగును విశ్వ

## —♦ రు చు లు ♦—

ఆ॥ ఉప్పు లేనికూర రొప్పదు రుచులకు బప్పు లేనితిండి ఫలము లేదు
అప్పు లేనివాడె యధిక సంపన్నుడు, విశ్వ.

ఆ॥ పప్పు లేని కూడు బరుల కసహ్యమౌ నప్పు లేనివాడు యధిక బలుడు
ముప్పు లేనివాడు మొదల సుజ్ఞానుండు, విశ్వ.

ఆ॥ నేయి లేనికూడు నీయాన కసువది కూర లేని తిండి కుక్క తిండి
ప్రియము లేనికూడు పిండపు కూడురా, విశ్వ
భోజనాలు నాలు బోలిమాండ్లకు చేటు, విశ్వ.

ఆ॥ తోకలుగలవాని దొడరి గొంతు బుక్కోసి మేక జీవములను మెడ కొరిచి కడమ జీవములను గాల్చుక తిందురు, విశ్వ.

ఆ॥ పక్షిజాతి బట్టి పరగ హింసలు బెట్టి కుక్షి నిండ కూడు కూరగాను
వండితినెడివాడు వసుధ భంగాలుండు విశ్వ.

ఆ॥ మాంసము దినకున్న మాటె గాడెసుక మాంసము దినునట్టి మాయజీవి
మాంసము జెడిపోవ మాటెట్టులాడు విశ్వ,

ఆ॥ ఆరురుచులు వేరు సారంబునొక్కటి సత్యనిష్ఠ వేరు సత్యమొకటి
పరమ ఋషులు వేరు భావ్యంబొక్కండు, విశ్వ.

క॥ నోరెరిగి తామయేమియు నేరని జంతువుల జంపి నెమ్మది దినునా
గూరవు సంకరజాతుల మారణమే మందునీక మహిలో వేమా

## —♦ తాంబూలము ♦—

ఆ. వంటికంపుకొక్క నొప్పి రాకుండ నాకు పోకసున్న మామ ధంబు
పెట్టకున్న నోరు పెనుగబ్బు గొట్టును, విశ్వ,

క. శిలవృక్షలతలబుట్టిన జలజాక్షులు ముగ్గురు గూడి చతురతతోడ
స్థలవాకిట రతి చేయగ నిలజనులకు లక్ష్మీకరము నిచ్చుర వేమా,

## ధనము

క. ధనమే మూలము జగతికి ధనమే మూలంబుసకలధర్మంబులకున్
గొనమేమూలముసిరులకుధనమేమూలంబుముక్తికినిహమునవేమ

ఆ. ధనము లేమియనుటదావానలంబగుదన్నుజెరచుమీరిదావుజెఱచు
ధనములేనిమదిని దలచనేపాపంబు విశ్వ.

ఆ. కలిమి గలిగెనేని కామునిగాజూచు లేమిచేతచేతజిక్కి లేవలేని
మదను వంటివాని మూలగాజూతురు, విశ్వ.

ఆ. పూర్వవాసనగలపుణ్యాత్ములకలిమియాటచెలమరీతినూరుచుండు
నెందరికొనగినను నెప్పటియట్లుండు, విశ్వ.

ఆ. కలిగినట్టియుండు గలుగకయుండు మరియు లేకపోవుతిరిగి కలుగు
కలిమి నెచటజూడ గారడి యనవచ్చు విశ్వ.

ఆ. భాగ్యవంతురాలు పరులయాకలి దప్పి తెలిసి పెట్టనేర్చు తనదు
దుష్టభార్యతనయాకలినేగాని పరులయాకలెరుగదరయ వేమా.

ఆ. చమురుగల్గుదివ్వె సంతోషమయివెల్గు ధనముగల్గువాని తలపు
హెచ్చు ధనముతీర తలపు తనుదానెతీరును, విశ్వ.

ఆ॥ తనకుభాగ్యముండు దక్కువలేకుండ గలుగుభాగ్యమెల్లగల్ల
యనుచు నమ్మికముగ జూచు నరుండగుయోగిరా, విశ్వ.

క. భోగంబుల కాశించక రాగద్వేషంబువీగి రంగుగతెలవగా వేగమె
మోహంబును రాగసు నాతడెయోగి రాజసువేమా.

ఆ. కనియు గానలేడు కదలింపడా నోరు వినియు వినగ లేరు విస్మయంబు
సంపదగలవాని సన్నిపాతకమిది విశ్వ.

క. కనియుండియు గనలేకటవినియుండియువినగ లేరువిస్మయమేమో
కవ,గుడ్డియు వినిచెవుడును యనునదిలెస్సాయెజనమునవనిని వేమ

ఆ. అర్థవంతుసొమ్ము నాశింతురందురు, అర్థికిడనిసొమ్మువ్యర్థమగును
వ్యర్థమైనసొమ్ము వ్యర్థులచేరున్, విశ్వ.

ఆ॥ దాచినధనమునకు దానును గొడుకును వాంఛపడుదురు కాని వట్టి
భ్రమలు భాగ్యహీనునకు ఫలము లభించునా, విశ్వ.

ఆ॥ వీపుడైన లేదు విద్యనేర్పిన లేదు చదువులందు లేదు సంధ్య లేదు
జన్మఫలము కాని జపియించినను లేదు, విశ్వ.

## లేమి

కం॥ పేదటిక మెంతదోషం బేదో యీజగతిలోన నీశ్వరుడెరుగున్ జే
దను బాగడవాడును కాదని శివమనుచును చూడుగనరా వేమ.

ఆ॥ తనకు లేనివాడు దైవంబుదూరును తనకుగల్గెనేని దైవమేల తనకు
దైవమునకు తిగులాట మిట్లుండు, విశ్వ.

ఆ॥ గ్రాసమేమి లేక కడుకష్టమైయున్న విద్యలేలనిలుచు వీలిపోక
పచ్చికుండ నీళ్ళు పట్టిననిలుచునా విశ్వ.

ఆ॥ వరగ లేమిచేత బంధువుల్ పగవారువ రగ లేమిచేత బరగతప్పు
వరగ లేమిచేత బరతత్వములు దప్పు, విశ్వ.

ఆ॥ పేదవానిబాధ పెనుభూతమైయుండు జూడసట్టిబాధ జూడరాదు
పేదవానిబాధ వివరింపగారాదు విశ్వ.

ఆ॥ ధనము లేమిగుణముతక్కువవడవచ్చు ధనము లేమి కీర్తి తొలగిపోవు
ధనము లేమి శుచిని దాబుద్ధినీయదు ధనము లేమి ఘనము తప్పు వే.

ఆ॥ ధనము లేమి సుతులు తప్పులు వడుదురు ధనము లేక పత్ని తాకనీ
యదు గినముల దిరిగి దాళికైయుండదు, విశ్వ.

ఆ॥ కుడువకట్ట లేక కూడుబెట్టగ లేక విడువ మడువ లేక గడవ లేక నడువ
లేనివాని వడపీనుగందురు విశ్వ.

ఆ॥ భాగ్యహీనునకు పరుసవేది దొరకదని కనువుపడదు యరసిచూడ
వానతోడవచ్చు వడగండ్లు నిలుచునా, విశ్వ.

ఆ॥ అప్పువడుటరోత హరిహరాదులకైన ముప్పుతోడిచలిమి మొదలె
రోతతప్పువట్టి దామాటలు బలురోత విశ్వ.

ఆ॥ అప్పువేనివార లధిక సంపన్నులు తప్పులేనివారు ధరను లేరు
గొప్ప లేనిబుద్ధి కొంచమైపోవురా విశ్వ.

ఆ॥ చిక్కియున్నవేళ సింగంబునైనను బక్కకుక్క జేరి బాధపెట్టు
బలిమిలేనివేళ పంతంబుచెల్లదు విశ్వ.

## దానధర్మములు

ఆ॥ ధార్మికునకుగాని ధర్మంబు తెలియదు కష్టజీవి మేలుకానలేడు
నీరుచొరకలోతు నీయాన తెలియదు, విశ్వ.

ఆ॥ అన్నమున్నవాని కన్నంబుపెట్టిన పారజిమ్ము వానిఫలితమేమి ధని
కునకును యిచ్చు దానంబులారీతి విశ్వ.

ఆ॥ ధర్మసత్యములను దన్పకచేయని కర్మజీవి మేలుగాంచలేడునిర్మల
హృదయుండు నీరూపమైయుండు విశ్వ.

ఆ॥ తండ్రిసొమ్మునైన దాయాది సొమ్మైన బరులసొమ్ములయినప్రాప్తి
ధనము దయను దీనులకు దానమిచ్చినవాడె బహుళపుణ్యజనుడు
వరగ వేమా.

ఆ॥ దాపిమడుగువాడు ధరలోన నధముడు దానమిచ్చువాడు దైవస
ముడు దానమిడనివాడు ధన్యుండుగాడయా, విశ్వ.

ఆ॥ ధర్మమరసిపూని ధర్మరాజాదులు నిర్మలంపు నీతి నిలుపుకొనిరి
ధర్మమే నృపులకు దారకయోగంబు విశ్వ.

ఆ॥ అన్నిదానములందు నన్నదానము గొప్పకన్నతల్లికంటె ఘనత
లేదు ఎన్న గురువుకంటె నెక్కువలేదయా, విశ్వ.

ఆ॥ ఇంచుకంతయున్న మీశ్వరార్పణమన్న పుణ్యలోకములకుపోవు
నపుడు అన్నదానంబునకు నధికంబులేదయా, విశ్వ.

ఆ॥ దానములకు నన్నదానము దొడ్డది గానములను సామగానమెచ్చు
ధ్యానములకు శివునిధ్యానము శ్రేష్ఠంబు విశ్వ

ఆ॥ ఆకలన్నవాని కన్నంబుబెట్టిన మాయనికర్పితముగ నారగించుధన
హీనునకిడు దానంబురీతిని విశ్వ

ఆ॥ ఇన్నిదానంబులను నేదానమెక్కువ అన దానముకన్న నధికమేది
కన్నది కన దిగగాన్పించు నారూపు విశ్వ

ఆ॥ తానుజన్మమగుట ధర్మంబుచేయగ కర్మగతిని యముడు కష్ట
పరచు కర్మధర్మములను గనుపీర బ్రహ్మంబు విశ్వ

ఆ॥ తనదుసొమ్ముకాద దానమివ్వగవచ్చు నవనిదొడ్డగాద దెవనికైన
నదురు బెదురు లేక నన్యులసొమ్ములదానమీయరాదు ధరను వేమ

ఆ॥ వలయునన్న రాదు వల దన్నపోవదు తానుజేసినట్టి దానఫలము
ఉల్లమందు వగవకుండుట యోగంబు విశ్వ

ఆ॥ దానధర్మములను దయయు సత్యమునీతి వినయ ధైర్యధుర్యవితర
ణము రాజుపాలిటికిని రాజయోగంబులు విశ్వ

ఆ॥ తనదు భ్రాతలెల్లదానంబుచేయగ తనకుగలదటంచు తలపరాదు
తనదుకాలుగోయ తనతమ్ము డేచ్చునా విశ్వ

ఆ॥ అరయనా స్త్రియునక నడ్డుమాటాడక తిట్టబడక మదిని తన్నుకొనక
తన్నుగాదనుకొని తాబెట్టవలెనయా విశ్వ

ఆ॥ పెట్టిపోయలేని పట్టినరులు భూమి పుట్టనేమివారు గిట్టనేమి పుట్ట
లోనచదలు పుట్టవా దిట్టవా విశ్వ

క॥ ఇచ్చేవారలనంపద హెచ్చేదేకాని లేమి యేలాకలుగు౯ యచ్చల
మనీరు చల్లిన పిచ్చలవిడి వచ్చుచుండు వినరా వేమా

క॥ భూతిలేసిలంజ భూతంబుగూతురు రీతిలేనిపోటు రాతివేటు దాత
లేని కొంప దయ్యాలకొంపరా విశ్వ

ఆ॥ దానమెంతొ జేసి ధరజేరు నొకవంక మానమెంచి తేను మాయ.
దగులు జ్ఞానము మదినిడగ ఖరవైరులను గెల్చు విశ్వ
క॥ ధర్మార్థకామమోక్షము నిర్మలమతి తెలియుగాక యితరులతరమా
యర్మిలిల దిగిచూచిన గర్మములకును లేదు ముక్తి గదరా, వేమా
ఆ॥ తోడబుట్టువు దోడరి ధర్మము సేయ తనకు గలదటంచు దలచ
వలదు తనదు కాలుగోయడము వారికాళ్ళలో రక్త మేలవచ్చురమర వే
క॥ ఆకొన్న యతిథి శివుడని కాకించుక లేక మదిని గరుణాన్వితుడై పో
కంతయన్న మిడినను నూకొని యా యముని గొట్టనువమిది వేమ
ఆ॥ వరులదత్తమిట్లు పాలన జేసిన నిలువదత్తమునకు నినుమడించు
నొకరికిచ్చుదాన మకట కాదొంగిలి వరుల కీయగలద ఫలము వే
ఆ॥ దానధర్మములకు దగనేడు రేపని కాలవ్యయముచేయ గష్టజ
నుడు తానునేమియగునొ తనబ్రతు కేమౌనొ మాయదెలియ
లేడు మహిని వేమ.

ఆ॥ దాతలేనికొంప దయ్యాలపెనువాడ నీతిలేనిమాట రాతివేటు
ప్రీతిలేనిలంజ పీనుగైతోచురా విశ్వ
ఆ॥ ధర్మమన్న వినరు తమునమ్మి భూవరుల్ యమునివారువచ్చి
యడలునించి చొచ్చికట్ట తమరు జొరబారగలరొకో విశ్వ
ఆ॥ లలితవిద్యభువిని గలిగి ఫలమేమి వితరణంబులేక వెలయదెందు
నారగింపులోన నాజ్యంబె లేనట్లు విశ్వ
ఆ॥ దాన మొసగకున్న ధాన్యంబు మదిహెచ్చు ధ్యానమొసరకున్న
జనును తెలివి తెలివికున్న నాశ తెగవేసినది హెచ్చు విశ్వ
ఆ॥ ఎంతకదుపైదైన నెంగిలియన్నంబు వరులకిడను ధర్మపరులజూచ నిల
ను బడినయట్టి యెంగిలాకులు నాకు కుక్కలై పుట్టుదురు కూడి వేమ
ఆ॥ పెట్టువారలెవరు కొట్టని దెవ్వరు పెట్టిపెట్టనట్టి దిట్టలెవరు పట్టు
దప్పకుండ భావించచూడరా విశ్వ

క॥ సున్నమును పిన్నవానికి సున్నితమగు స్వర్గమేదియుండును జూడన్
వన్నెకుమించెసున్నము సున్నితమగు బ్రహ్మమునకునువమది వేమ

క॥ కాంతభస్మముచేసిన కాంతులకజ్ఞానసంఖ్య సంజీవగుచున్
గాంతదలపకయుండిన శాంతముగా నొకరిదేహ చరితము వేమా

ఆ॥ కాంతసింధురంబుకడుపిత్తవ్యాధికి నొనరు తేనెతోడ నొసగబడిన
తనదు దేహబలిమి ధన్యమైయుండురా విశ్వ

ఆ॥ ఆ సుధముకన్న నతిశయంబైపట్టి కల్పమేగలుగును గావకంబు
ఆయుసున్నముదిన నంధకారమడంగు విశ్వ

—♦ మనసు ♦—

ఆ॥ శివునిమీదమనసుస్థిరముగానుండినగామమోక్షమరయగాను నొను
శివునిమీదమనసు చీమంతదప్పితేకాదుకాదుకాదు కాదు వేమ

ఆ॥ మనసులోనబుట్టు మరికోర్కెలన్నియుకోర్కెలందుముక్తిపడరు
వడదు మనసు బ్రహ్మనుచు మదినెరుంగలేరు విశ్వ

ఆ॥ కడువుదిచ్చుచేత కామానలముచేత క్రోధవహ్నిచేతకుటిలవడక
యొక్కమనసుతోడ నున్నముక్తిరా విశ్వ

ఆ॥ పొంకమైనమనసు పోసికసర్వేశుం వంకనిలుపువాడు వంశవరుడు
వంకనిలుపకున్న వచ్చుపాపదలు విశ్వ

ఆ॥ దిరుగవలయుమనసు దిరిగినయందాక దిరిగియుండాకమనసుదిరుగ
వలయు తిరిగి విరిగనేని దేవుంపు తానొను విశ్వ

ఆ॥ మనసునిల్పనట్టి మర్మసుజ్ఞానులు గదిమమోక్షవనముగన్నవారు
చెట్టుబెట్టి ఫలము చేకొనకుందురా విశ్వ

ఆ॥ మనసునందు ముక్తిమలయుచు నుండగమనసునెరుగలేకమనుజు
లెల్ల మనసు నంటలేక మాయమైపోదురు విశ్వ

ఆ॥ ఒక్కమనసుతోడ నున్నది సకలంబు తిక్కబట్టినరులుదిరుగలేరు
ఇక్కవెదకి నడువ నొక్కడే చాలడా విశ్వ

ఆ॥ మనసుపూని గెలిచి మనసులో సుఖించి కడుమోక్షపదము గను
నువాడు చెట్టుబెట్టఫలము చేకూరకుండునా, విశ్వ.

ఆ॥ మనసులోనిశివుని మానకనిల్పిన యోగియింద్రుడు వానినుర్విలోన
శివునిఁదలపలేని చిత్తంబదేలనో, విశ్వ.

ఆ॥ మనసులోనముక్తి మరియొకచోటను వెదుకబోవువాడు వెర్రి
వాడు గొర్రెజంకబెట్టి గొల్లవెదకురీతి, విశ్వ.

ఆ॥ మ్రానుదిద్దవచ్చు మరివంకలేకుండ దిద్దవచ్చురాలు తిన్నగాను
మనసుదిద్దరాదు మరివంకలేకుండ, విశ్వ.

ఆ॥ ఇనుము విరిగెనేని యినుమారు ముమ్మారు గాచి యతుకువచ్చు
గ్రమముగాను మనసువిరిగెనేని మరియతుకరాదయా, విశ్వ.

ఆ॥ మనసునిలువలేని మాయానువర్తనులు మనసువడుదురొక్క
మగువమీద నిట్టివ్యర్థజన్మ మీబ్రతుకేటికి, విశ్వ.

ఆ॥ తరచు దనువుబాసి తరితోతనుమరచి పరమానందు మనసు బదిల
పరచి గరిమనున్నయట్టి ఘనులెందును గలరొక, విశ్వ.

ఆ॥ నీటిలోని వ్రాత నిలుపకయున్నట్లు సాటిలేనిజగతి పరము లేదు
మాటకెల్ల మనసు మరచి కోరుచునుండు విశ్వ.

ఆ॥ మాటలాడవచ్చు మనసు నిల్పగరాదు తెలువవచ్చుదన్ను తెలియ
రాదు ఘనియపట్టవచ్చు శూరుండుగారాదు విశ్వ.

ఆ॥ ఇదియొక పరమటంచు నితరచింతలువీడి మనసుచెదరనీక మట్టు
ఇట్టి కొదవలేక నిలువ కైవల్యముఁబొందును, విశ్వ.

ఆ॥ ధాత్రిజనులకైన జగనెరిగించిన నొనర హరునెఱుంగు నుపను
నొకటి మనసు చెదరనీక మహిమతో జూచుటే, విశ్వ.

ఆ॥ ఆత్మబుద్ధివలన సఖిలంబు తానయ్యె జీవబుద్ధివలన జీవుడయ్యె
మోహబుద్ధివలన ముదితలదర్శించె, విశ్వ.

ఆ॥ తరుణియున్న గన్నతనయుని జూడిన పురునికళలుమించి మెరసు
పారు బాపజాతిమనసు పట్టింటవచ్చునా విశ్వ.

ఆ॥ చంద్రుడట్టివాడె శాపవశంబున కళలహీనవృత్తిగలిగెగదర
పుడమిజనులకెల్ల బుద్ధులిట్లుండురా, విశ్వ.

క॥ మనసునవలము రెంటికిఘనమనుగొంచె బుదెలియుగావ తెజుమ్మా
కనుమూసి తెరచినంత నెఘనమై వివరించు మనసుకానదు వేమా.

క॥ మనసే మాయామృగమై మనసే మాయైనదాని మరిపోకుండన్
మనసున మనసును జంపిన మనసందేముక్తిగలదుమహిలో వేమా

ఆ॥ కప్పురంబుమనసు కాంక్షించుయోగికి జ్ఞానదీపశిఖయు దాటించు
గానవచ్చునాత్మ గ్రమమాణమైయుండు విశ్వ.

ఆ॥ మంచియమలుకోరు మంచి స్త్రీనుగోరు మనసు జెడ్డదెంతొ
మనసొకాని యించుకంతయైన నిలనింపించదు విశ్వ.

ఆ॥ మనసుశివునిమీద మరితాళి తాళిమా గుక్కపంది శివులగొ...
చేసి కుక్కవంటి పాపగుణముని తెలియరు, విశ్వ.

## దేవుడు దేవళము

ఆ॥ తానునిలుచుచోట దైవంబులేదని పోదురు జనులు తిరుపతులు
తిరుగ గీమువీడి చేతి సొమ్మెల్లబోజేసి చెడిగృహంబు తానుజేరు వేమ

క॥ గంగాధరుడే దైవము నంగీశము దవులకింపు సర్వజ్ఞులకున్ బంగార
మె యుపభోగం బంగజుడే మృత్యుహేతు వరయగ వేమా.

ఆ॥ దూరయోచనలకు దూరమే దైవంబు తనువుదూరమైతె తగులు
నవుడు జీవిదవ్వుచేయ దేవుడైనిల్పురా విశ్వ.

క॥ నిఖిలాకారు డనంతుడు నిఖిలంబును సర్వసాక్షి నిజముదానె నిఖి
లంబు నిర్వికారుడు నిఖిలంబున బ్రహ్మమగును నిజముగ వేమ.

ఆ॥ నందుడైనవాని యిందునందకుండునన్ని తావులందుహరునివలెను
దెలియువారికెల్ల దేవుడైకనిపించు విశ్వ.

ఆ॥ ఒక్కప్రొద్దునుండి మొగి నీళ్ళమునిగియు కూటునంటి వేల్పు గడు
పుచునుచు దానినోరుగొట్టి తాఁతిందురు. విశ్వ

ఆ॥ ఎంతవేల్పుకైన నెసగ నైవేద్యంబు వాసనచూడకుండ వండలేరు
మీఁదిమీఁదనుచు మింగేరు గ్రుక్కిళ్ళు, విశ్వ

ఆ॥ వెన్నచేతపట్టి వివరంబు తెలియక ఘృతమునసిగినట్టి కూళభంగి
తాను దైవమయ్యు దైవాలగొలుచుటా, విశ్వ.

## —♦ షట్చక్రవర్తులు-షోడశమహారాజులు ♦—

ఆ॥ ధరఁ జక్రవర్తులార్గురు వరగంగా రాజులెన్నఁ బదునార్గురు తా
నెఱయోధులు వీరేనని వెఱచక మును వెనుకజూఁడి వెదకరవేమ

ఆ॥ అన్నృత మాడలేక యల హరిశ్చంద్రుండునాలుబిడ్డనమ్మియతఁడు
కూడ మాలవానికవుడు మఱిఁగొలునై యుండు విశ్వ

ఆ॥ నలుఁడు దమయంతి ననువుగా బెండ్లాడి పుష్కరునికినోడి భూమి
విడిచి భార్యతోడ దాను బహు పేదవారలై యడవి దిరుగలేదె
యవుడు వేమా.

ఆ॥ పుడమి ధర్మముగను బురుకుత్సుండనురాజు ధర్మ మనుసరించి
ధాత్రినేలి తనకు గానివేళ దాబడె కష్టముల్, విశ్వ.

ఆ॥ పొందుగ ధరలోన మును పురూరవ రేఁడు ధర్మమేజయమనితనరి
యుండె దనదు కాలగతిని దానెఱుగలేక మదనుచేత జిక్కి
మరిగె వేమా.

ఆ॥ సగరు డుర్వి రాజచక్రవర్తియటంచు బరులు తన్నుబొగడ
బ్రతుకుచుండె నిట్టుల విధి వీరికెందుకు రావలె విశ్వ.

ఆ॥ కార్తవీర్యునంటి ఘనులెవ్వరును లేరు వీరశౌర్యమునను. విప్రవీగ
బరశురాముచేత బాధలును వడిచచ్చె, విశ్వ.

సీ॥ గయుడంబరీషుండు ఘన శశిబిందుండు యనఘు పృథుండు మరుత్తు
డుండు భరత సుహోత్రుడు బరంగ శ్రీరాముండు నా దిలీప
నగరులవన మఱియు భార్గవుండు యయాతి వరగ భగీరథుండు
డల శిబి మాంధాత లమర భువిని నిటువంటి నృపతులు నేడ్గురు
దొమ్మిదిం బదునార్గురు నృపులు ప్రబలిరిలను ఇట్టి యోధాన
యోధులయ్యలను బుట్టి గట్టిగా నుండు వేళను గడచిరవుడు మం
డలంబుం గానక మరచి రంత తెలిసి నడచినవారెవో తీరు వేమ.

ఆ॥ వలికి బొంక లేక భల్లాణరాజవుడు వడలి గూర్చి యిచ్చెం బరునకవుడు
బాళిమీఱం దుదకు బాలుండై యుండురా విశ్వ.

ఆ॥ దశరథుండు రాము ధరణికిం బట్టంబు గట్టందలచె నతడు గట్టె
జనులు తలంపు కొలది గాదు దైవికమది వేరె, విశ్వ.

ఆ॥ మొలత నడవినుంచి మృగము వెంటనె పోయె రామభద్రుడంతో
రసికుడయ్యు బోలుపుదప్పు వేళ బుద్ధులట్లుండురా, విశ్వ.

ఆ॥ కనకమృగము భువిని గల్గుట వినరెక్కో రాము డెఱుకగల్గు రాజు
కాడె చేదు కాలమునకు చెడుబుద్ధి పుట్టించు, విశ్వ.

ఆ॥ ఎంత చేసి చేసి యేపాటు వడినను రాచకృపలు నమ్మరాదు సుమ్ము
పావముతోడి చెలిమి వదివేలు చెప్పిన విశ్వ.

ఆ॥ పుడమి యుప్పరంబు బురికొల్ప జగములు రక్ష సేయగల్గు రాజు
లెవరు మ. హింసతియును పేర మనుజాకేడదో? విశ్వ.

ఆ॥ దుండగీడుకొడుకు కొండీలు చెలికాడు బండరాజుకును బహుగు
మంత్రి కొండముచ్చునకును కోతి పేరంటాలు, విశ్వ.

—♦ మేల్కొడులు ♦—

ఆ॥ తనకు మేలుజేయ తా దెలియగనేర్చు నెలమితోడ గుక్క యెఱుక
భువిని తనకు జేయుమేలు తా దెలియగలేని మనుజుడెంత ఖలుడో
మహిని వేమ.

ఆ॥ ఒకరికీడు వేతు నొక్కరికియివ్వడు నొక్కరిమేలు వేతునొకరి
కీడు చొట్టచేలువాడు సుమ్మెవ్వడును గీడు విశ్వ

ఆ॥ వానివర్తనలును వరుసలు మర్యాద దప్పి నడిచెనేని దగులుగీడు
వదలకవుడు తాకునది తప్పితే మ జిమ్ముసలితనమునైనముసుగు వే

ఆ॥ అధికశక్తిచేత మొవటిసొమ్ముకు హానికుదుఃసొమ్ముకన్న గొంత
హాని మొదటిపత్తమునను మూలకర్తకుహాని విశ్వ

ఆ॥ హానికలుగునాడు యధికవస్థలుగలుగు హానిలేనివానినగయలేదు
హాని తెలియువాడు యతడెపో శివయోగి విశ్వ

ఆ॥ పట్టువస్త్రములను వరగ భూమధనముల గుమువలిడు జెల్లగోడువ
వద్దు లనుభవింపగూడ దడడెంతవాడైన విశ్వ

ఆ॥ ఇహామునందు జాల యిడుముల వడినను బడుగుపొందగలడెవర
మ వదవి పేద కసువువనునె పృథివివైభాగ్యంబు? విశ్వ

## — కల్ల—నిజములు —

ఆ॥ కల్లలాడువాని గ్రామకర్తయెరుగుసత్యమాడువానిస్వామియెరుగు
బెక్కుతిండిపోతు బొండ్లామెరుగునా విశ్వ

ఆ॥ నిజమువరుసనెరిగి నిర్గుణాత్వంబందబలుకులోని శబ్దములదెలియ
బలుకకుండువాడె వరమాత్మ యగునురా విశ్వ

ఆ॥ నిజములాడువాడు నిర్మలుండైయుండు నిజములాడువాడు నీతి
వరుడు నిజమువల్కకున్న నీచచండాలుండు విశ్వ

ఆ॥ కల్లలాడుకంటె కష్టంబు మరిలేదు కష్టమెపుడు కీడుగలుగజేయు
ద్విజుడ ననుట జూట ద్రిమ్మరితన మది విశ్వ

క॥ కల్లను వలికెడి నరులకు దెల్లమిగా బ్రహ్మవిద్య తెలుపుటయెల్లన్
జల్లను పాలను గలిపిన జల్లకుతోనంటినట్లు సహజము వేమా

ఆ॥ పుట్టను చెరగంగ బుట్టెడినను జిక్కిపోల్లువిత్తులందుభూమిలోన
నాడితప్పుమాట యంతకుస్వల్పమే విశ్వ

ఆ॥ నిజములాడువాని నిందించుజగమెల్ల నిజములాడరాదు నీచులొద్ద
నిజముచెప్పవలె నిర్మలులనుగూడి విశ్వ

ఆ॥ ఆడి తప్పువార లధిమానహీనులు గొడ్డెరుగవాడు కొద్దిగాడు
కూడికీడుచేయు గ్రూరుండు దలపోయ విశ్వ

ఆ॥ నిజము కల్లరెండు నీలకంఠు డెరుంగు నిజములాడకున్న నీతివచ్చు
నిజములాడునపుడు నీరూపమైనిల్చు విశ్వ

ఆ॥ తరచుకల్లలాడు ధరణి రాజులయిండ్లం వేళ లక్ష్మి వెడలపోవు
నోటికుండలోన నుండునే నీరము విశ్వ

ఆ॥ కల్లనిజములెల్లఁ గరకంఠుడెరుగును నీరుపల్లమెరుగు నిజముగాను
తల్లి తా నెరుగును తనయుని జన్మంబు విశ్వ

## — ♦ బాగోగులు ♦ —

ఆ॥ ఓగునోగు మెచ్చు నొనరంగ అజ్ఞాని భావమించి మెచ్చి బరయు
లబ్ధు వంది బురదమెచ్చు పన్నీరుమెచ్చునా విశ్వ.

ఆ॥ వేము బాలుబోసి ప్రేమతో బెంచిన జేదునుడగి తీపు జెందబోదు
ఓగునోగుగాక నుచితజ్ఞు డెట్లవునొ? విశ్వ,

ఆ॥ కూళ్లమెచ్చి గుణవంతుజెడనాడు నట్టివారిమెచ్చ రెట్టివారు
గ్రామాను ధూలమునకు జ్ఞానంబు డెలియునా? విశ్వ.

ఆ॥ రేగువుచ్చకాయ రేమెల్లదన్నిన మురగదంతకంత బెరుగుగాక
యొరుల ఛీ యనంగ నోగు సిగ్గొందునా? విశ్వ.

ఆ॥ ద్రోహబుద్ధినైన దొంగరికమునైన జటలనైన సాహసమునైన
సంపద దధికువలస సాధింప దగుడొప్పు బడుగు కిడుట బాగు
వడును వేమ.

ఆ॥ ఓగుబాగెరుగని యుత్తమాధమజనుండు నిలను శుద్ధిజనము నెంచు
కేల మృగముతోడ గుక్క మొఱిగిన సామ్యమా విశ్వ

—♦ అల్పాధికులు ♦—

ఆ॥ ఆదికాలమునను నల్పుడేమియెఱుంగు జెప్పలేనుగాన తప్పువట్టు
ద్రోణు నేర్పుకుక్క దొంతులు పేర్చునా? విశ్వ

ఆ॥ అధికమతులతోడ నాప్తులతోడ వదరువుగుణు తెంగి వలుకకున్న
వచ్చు జెడ్డతనము హెచ్చుగా గాంభీర్యహాని చెందుతనకునవుడు వే

ఆ॥ అధముడయినవాడు యధికుని జేపట్ట నతనిమూలె నడచునవని
లోన గజపతింట గ్రుడ్డి గవ్వలు చెల్లవా? విశ్వ

ఆ॥ అధికుడయినవాని కధికారమిచ్చిన నచటివారినెల్లనాదరించు
జెఱకు దిన్న నోరు చేదారగించునా విశ్వ

ఆ॥ గుణహీనజనుని గుణమెంచగానేల బుద్ధిలేనివాని పూజలేలమున
సులేనతనికి మంత్రింబులేలను విశ్వ

—♦ ఆకలి దప్పి ♦—

ఆ॥ కావుకావుమనుచు గరుణతో నేడ్చుచు శిశువు తుత్తుచేతజిక్కి
చొక్కుబాల నిచ్చునట్టి వడతికి బుణ్యంబు విశ్వ

—♦ బుద్ధి ♦—

ఆ॥ ఆత్మబుద్ధివలన నఖిలంబు దానయ్యె జీవబుద్ధివలన జీవుడయ్యె
మోహబుద్ధివలన ముదితపై దలవయ్యె విశ్వ

ఆ॥ బుద్ధియుతునకేల పొసగనే సఖ్యంబు కాగ్యవాదికేల కడుచలంబు
కుచ్చుకూనకేల గురుదేవభక్తి విశ్వ

ఆ॥ ఇంతవగవనేల యేకాంతబుద్ధిని హరిదారాదులందు నాశలుడిగి
శాంతబుద్ధినుండ నమకూరు సౌఖ్యంబు విశ్వ

హీనగుణమువాని నిటుచేరనిచ్చిన నెంతవారికైన నిడుమలగును
ఈగకడుపుజొచ్చి యిట్టట్టు జేయదే? విశ్వ

ఆ॥ విష్ణుగర్భమందు వెలసెను లోకాలు అందుసకలజీవు లమరగలవు
ప్రాణికోటులెల్ల వరగవైష్ణవులయా, విశ్వ.

## — రాజులు —

ఆ॥ ఎంతచేసిచేసి యేపాటుపడినను రాచకృపలు నమ్మరాదుసుమ్ము
పాపముతోడిచెల్మి పదివేలు జెప్పిన విశ్వ.

ఆ॥ ధనములేకయున్న ధైర్యంబు నిలువదు ధైర్యమొడవనేనిధనము
లేదు ధనము ధైర్యమరయ దగ భూమిపతులకు విశ్వ.

ఆ॥ పుడమి యుప్పరంబు పుట్టెనె జగములు రక్షసేయగల్గురాజులెవ
రు మహీపతి యనుపేరు మనుజుని కేడదో? విశ్వ.

ఆ॥ చంపదున్నరాజు చవు వగ్గలంబిచ్చు జెఱుపనున్నవాడు చెలిమి
జేయు గరువనున్నపాము నెఱిగాచుకొనియుండు విశ్వ.

## — దినము —

క॥ ఒకదినమును నొకనెలయును సగణితముగ నొక్కయేడు నరులకు
నటుగా యుగయుగములకీలెక్కలు పొగడొందును జగములాదు
బ్రాలువుగ వేమా.

క॥ దినమొక్కటి నడచును మఱియునచంద్రి సర్వములిల నిరువది
యొకవెయ్యువగా నార్యాక్షరనుచును మనసమున దెలియంగశిలయు
మహిలో వేమా.

ఆ॥ ఈశ్వరంబులన్ని యేడుపాళ్ళుగజేసి యేడుమూర్తుల కవియిచ్చి
వేసి నిత్యకర్మమునను నిలుచురా నెరయోగి విశ్వ.

క॥ వరగును గాలి నభయుంబున నెఱయంగా భూమియందు నీరుండు
గదా దరిద్రాపుల వేఱొకటియిరవుకొనుచు దేశమల్లయెల్లడ వేమా

ఆ॥ కరతలంబునెత్తి కాలునదిమిపట్టి ఊర్ధ్వదృష్టిచేతనొనరనిల్పి నర్వ
మైతనరుట చాల యాయువుగల్గు విశ్వ.

ఆ॥ ఏడు నైదునారు నెఁమిది తొమ్మిది యేమిటట్టునుఁడి యెంతతిరుగు
వాడివాడి యెంతవాడరా యదియేమొ విశ్వ.

— ♦ వారము ♦ —

ఆ॥ ఆదిసోమ భౌమ బుధులాదిగాఁగూడి గురుడు శుక్రశనియు
గురుతులెన్నొ ఎన్నిదినములైన నిలనొక్కదివనమే విశ్వ,

— ♦ లోకము ♦ —

ఆ॥ లోకమందుబుట్టి లోకమందే పెరిగి లోకవిభవమోర్వలేక
జనుడు లోకమందె చవికిలోఁబడి చెడిపోవు విశ్వ.
ఆ॥ ఇంద్రలోకమనగ నింద్రజాలమనగ నింద్రవిద్యలనగ నిన్ని
యొంక కలియుగమున నరులు కానరు భ్రమచేత విశ్వ,
ఆ॥ విశ్వమనగనే వివరిఁచి చూడుడీ విశ్వమైదుచేత వెలయుచుండు
విశ్వమును మదిలోన వెదకి వీక్షించుడీ విశ్వ.
క॥ లోకము తను ఛీ! యనగా లోకముగా ఛీయనెడి లోకములోనే
లోకము తనలోనుండుట లోకము నెంచగ ముక్తిలోకమువేమ
ఆ॥ తనదుకర్మచేత దానులోకమునలోన దనదు తల్లిగర్భమునను
బుట్టి తన్నుమఱచి తానుతనువని చెడునయా విశ్వ,

— ♦ మత్సరము ♦ —

ఆ॥ మత్సరంబు మదము మమకార మనెడి వ్యసనములను దగిలి
మసలబోక నరులకుపకరించు వరముడనగు పొమ్ము విశ్వ.
క॥ కథలనగా మనుచిక్కని కథలెన్నియు చదివిచదివి కలవరపడగా
పృథివిని మృతమికనిక్కము మొదమున బ్రహ్మాంబునంటముక్తిర వే

## —♦ లోభము ♦—

ఆ॥ లోభివాని జంప లోకంబులోపల మందువేత్త లేదు మరమునగలదు
పైక మడుగు ఁత భగ్గున బడిచచ్చు విశ్వ
ఆ॥ ఇరుగుపొరుగువారి కైనయునంపదజూచి తమకు లేదటన్న ధర్మ
మేమి? ధర్మమున్న దొల్లిరనన్నక చచ్చిరికర్మఫలము నేడుఁగలిగెనే
ఆ॥ లోభ మోహములను ప్రాభవములు దప్పదలచినవనుతెల్ల దప్పి
చనును తామొకటి దలప దైవమొండు తలంచు విశ్వ
ఆ॥ కలిగి పుట్టలేని కర్మజీవులకెల్ల దిరిపెము దొరికదిల దీనులార
తెలియ జూచుకొనెడి దృష్టాంత మిదిమీకు విశ్వ
ఆ॥ దూరదృష్టిగనరు తూగినదనుకను పారువట్టెరుగరు పడినదనుక
దండనాధులైరి ధర్మసాధ్వులుగాక భూమిజనులం వెఱ్ఱిబుద్ధి
వేమ

ఆ॥ తాముదినకొరులకు ధర్మంబు చేయకకొడుకులకనిధనముకూడ
బెట్టి తెలియజెప్ప వినక తినకేగినవెనుక సొమ్ము పరుల నంటు
జూడు వేమ

ఆ॥ దాతగానివాని దానెంత వేడినా దాతయగునె వాడుఁధరణిలోన
నాచు దర్భయగునె యబ్ధిలోముంచిన విశ్వ
ఆ॥ ఒడ్డుపొడుగునైన గడ్డంబు నిడుపైన దానధర్మమిడక దాతగాడు
ఎను మదెంతటిదైన నేనుగుబోలునా విశ్వ
క॥ ఒల్లనినతి నొల్లనిపతి నొల్లనిచెలికాడు విడువ నొల్లనివాడే
గొల్లడు గొల్లనికైతే చెల్లంబో కొమ్ములున్న చెప్పర వేమా
క॥ దేహాభిమాన ముడుగక మోహాదులు విడుచునెట్లు మునులకు
నైనన్ సాహసమున వది యుడుగగదాసోహమ్మనియెఱుగవచ్చు
సుమ్మీ వేమా

ఆ॥ ఇంతులఁ గనగానె యింతింత యనరాదు అగ్గివలన కరగులక్క-
రీతి వెలయు మోహమిట్టివింతలు సేయురా విశ్వ.

ఆ॥ అంగమెల్లవదలి యటు దంతములుపీడి తనువు ముదిమిచేతదఱు
చువడక ముప్పుతిప్పలగును మోహంబు విడువదు, విశ్వ.

క॥ మోహము దీఱకయుండే దాహంబై దేహమెల్ల తల్లడపడగా
గేహంబున బొరలాడుచు మోహంబునశివునిదలచ ముక్తిర వేమ

ఆ॥ ముఖము జూచి తేను మోహంబు ఘనమాను, భగము జూచి తేను
పాయు వలపుకూశినవలపెల్ల గుస్తరింప గూలెదు విశ్వ

ఆ॥ ఎన్నినాళ్ళనుండి యొసిన మోహంబు చెలిమిచేతనుండి చెల్లలేక
తల్లిదండ్రి పుత్రదాయాదులను వట్టి భ్రాంతిచేత జిక్కువడుర వే.

## —♦ మదము ♦—

ఆ॥ కసరుకాయ నమలి కచ్చలు బిగియించి కాంతవిడుచువెల్లకాని
గుణము వెంపలితరు గట్టవేదండ ముండునా? విశ్వ.

ఆ॥ మదమువలన గలుగు మాటలు బహువలికి క్రముచ్చుముద్దులాడి
మోసవుచ్చి కాసు రాఁబెరికెడి కష్టుండు గురుఁడౌనె విశ్వ.

క॥ ధనమెచ్చిన మదమెచ్చును మదమెచ్చిన మత్సరంబు మానక
హెచ్చున్ ధనమడిగిన మదముడుగును మదముడిగిన మత్సరంబు
మానుర వేమా.

ఆ॥ అన్నమదముచేత నతివలు బురుషులు నేపుమీర మదనుఁ డేచ
సంద్రు అన్నముడుగు వెనుక నతడెందుబోవునో, విశ్వ.

ఆ॥ మదముచేత లోకమాయలు తెలియక మదముచేత దన్ను
మఱచు నెవుడు బుద్ధిలేక శుద్ధపశువులై చెడుదురు, విశ్వ.

ఆ॥ కూటికివగలేక కూర్చున్నవానికి, నాడదానిమీద నాశగలదె
అన్నమదమునుండి యఖిలమదంబులు, విశ్వ.

## వృక్షము

క॥ చెట్టందు విత్తుపుట్టెను అట్లావిత్తునకు చెట్టు నమరగ బుట్టెన్
చెట్టును విత్తును రెండును బుట్టినయది తెలియవలెను భువిలో వే

ఆ॥ చెట్టుబెట్టువెనుక జేలోతునై యుండునంత తాఁబడుకట్టెనగడుగొండు
ఆసువారికింత నడుగుట జెప్పర విశ్వ.

ఆ॥ చెట్టు మొదలు లేదు చెలగికొమ్మలునల్గు బట్టబయట ప్రమాను
పళ్లు పండు తినగను చవిలేదు తిప్పలు బహుమెండు, విశ్వ.

ఆ॥ చెట్టునందుపుట్టు చెలరేగిగాయలు తసర గత్తిచేత దరుగవలయు
వడి తినగనాయె వర్ణంబు దెలియుడీ విశ్వ.

ఆ॥ చెట్టుమొదటిపాలు శివునికంటనుదీసి చెట్టుమొదలపోసి శివునిగాం
చి చెట్టువలెనెయుంటె చేపట్లు కలుగురా? విశ్వ.

ఆ॥ ముష్టివేపచెట్టు మొదలుగా బ్రజలకునరగ మూలికలుబసికివచ్చు
నిర్దయాత్ముకుండు నీచుడెందునతను బసికిరాడుగదర వసుధ వేమ.

ఆ॥ చిత్తమైన వేరు శిథిలమైనప్పుడె ప్రకృతియనెడిచెట్టు భస్మమౌను
కోరికలనుయేమిటి కొమ్మలుండుఁబో విశ్వ.

ఆ॥ ప్రమాకలోన నగ్ని మణి యుండగావచ్చు అగ్నిలోన ప్రమానుకలవి
గాదు ప్రమానలోన యగ్ని మరియాద సంసారి, విశ్వ.

క॥ ప్రమానున ననలము పుట్టెను ప్రమా కెరుగదు యనల మునికి మనసు
జాలు మరితా ప్రమాకును ననలమువలెనే శాకారిన యోగియుండు
గదిరా వేమా.

అ॥ ప్రమాకు శాలవేసి మహిమీద నొకజాణ పూని తిరుగుచుండు
బొందుగాను కాలినట్టిప్రమాను కడురమ్యమైయుండు విశ్వ.

అ॥ మొదటి తిరువునందు మూడుకొమ్మలు అసలు కొసలు తిగ లాతు
లమరె బువులు పిందెలెల్ల భువనముల్ నిండెరా విశ్వ.

ఆ॥ ఆతుకానవచ్చు హరిహరాదులకైన గొమ్మకానరాదు కోరిచూడ
కొమ్మకానరాక కొనియాడకుండురా విశ్వ.

ఆ॥ మొదట బోయునీరు ముందుబీజముకెక్కి మొదగకురికి వేగ
మొలకలెత్తు పృథివి బెరిగి వె.యును వృక్షాలు విశ్వ.

## — ♦ స్థావరములు ♦ —

ఆ॥ స్థావరములు భక్షించుచుండి భావింపగ జగతివారు బహువిధరుచులఁ
ఆవల దయలోదామే తీవరపడి తమ్ముదామె తిందురు వేమా.

క॥ కదలని జీవములన్నియు మద మొనలుగ నాలుగుచుల దొలగక
యుందుర్ గదిపెడి జీవములన్నియు గదలక కష్టంబులోను
గదరా వేమా.

క. పుష్పమినిగల పడజీవులబడ బాగ్నియుదీవులకును బాదెడియొడలుఁ
జడమున గూడినయపుడే కడను బ్రబళియమనెడి పస్తుగలుగును వే

క॥ కడజీవుల స్థావరములు వడి చన పోవంగా నెరిగి భావంబులోనేవిడు
వక బ్రహ్మము దలచరు వడిచనపోతుందురేమొ వసుధలో వేమ

ఆ॥ అభిజాత్యముననె యాయువున్నంతకుఁ దిరుగుచుండ్రు భ్రమలఁ
దెలియలేక మురకిభాండమునను మునురునీఁగలరీతి విశ్వ.

ఆ॥ బుషులెరుంగనట్టి విషయంబు భువిలేమువారు చెప్పెనంతవరున
నగును తెలియు కనెడువారు దేబెలు నిజమయా విశ్వ.

ఆ॥ ఎలుగుతోలు తెచ్చి యెందాక నుడికినా నలుపునలుపెకాని
తెలుపుకాదు కొయ్యబొమ్మలదెచ్చి కొట్టిన గుడియానె విశ్వ.

ఆ॥ ఒకని జెరుతుమంచు నుల్లమునదెతురు లిమటిఁ గలుగుజేటుదా
మొఱుగక తముఁజెరుచువాడు దైవంబుగాడొకో విశ్వ.

ఆ॥ ఓగునోగుమెచ్చు నోనరంగసజ్జను భావమిచ్చమెచ్చు బరమలుబ్ధు
పంది బురదమెచ్చు పన్నీరుమెచ్చునా? విశ్వ.

ఆ॥ ఔంటంచు నొక్కఁడాడినమాటకు కాదటంచు బలుక గుణము
పట్టుదాగి నిలువఁదీయుఁ బాతలు దిగవలె విశ్వ.

ఆ॥ కండకావరమునఁ గానదు మరణంబు మదముచేతఁ దత్త్వ
మహిమఁగనదు భోగవాంఛచేత బురహరుఁగానదు విశ్వ.

ఆ॥ కన్నులందు మదము కప్పికొనఁగ గాని నిరుడుముందటేఁడు
నిన్నమొన్న దగ్గఱైనవారు తమకంటె తక్కువవారె విశ్వ.

ఆ॥ తగను తగదటంచు తగువారు చెప్పినవినఁడు మొఱకు చెనఁటి
గానకను మునులు చెప్పుధర్మముల మీఱ నింతెరా విశ్వ

ఆ॥ తనదు బాగుగోరి ధర్మంబుఁజెప్పిన దిట్టుచుండు మొఱకు తెట్ట
యెదుట గడ్డివేయ పోట్లగొడ్డు కొమ్మాడించు విశ్వ.

ఆ॥ తన్నుఁబెంచి యొకలు దగ మెచ్చవలెనని సొమ్ము లెల్లఁ బెట్టి
నెమ్మి మీఱ నొరుల కొఱకు దాని యుబ్బుచుండును విశ్వ.

ఆ॥ వ్యాసవసవాసి పరిణామవర్తన కూపవాసి కెల్ల గురుఁడు వడుచు
బ్రహ్మదేవు వెంటఁ బ్రాకృతుండరుగుఁగా విశ్వదాభిరామ వినుర వేమ.

సంపూర్ణము.



